# శ్రీ శ్యామశాస్త్రి కృతులు





సంకలన, పరిశోధన కర్తలు
టి. ఎస్. పార్థసారథి
భావరాజు నరసింహారావు



త్రివేణి పబ్లిషర్సు
మచిలీపట్నం

ప్రథమ ముద్రణ : 1976

త్రివేణి ప్రెస్, మచిలీపట్టణము

మూల్యం : నాలుగు రూపాయలు

# శ్రీ శ్యామశాస్త్రి

శ్రీ శ్యామశాస్త్రి కర్ణాటక సంగీత రత్నత్రయమున వయస్సుచేత జ్యేష్ఠుడు. ఆయన పూర్వులు ఆంధ్ర దేశమున నేటి ప్రకాశం మండలములోని కంభంవారు. తరువాత తమిళ దేశమునకు వెళ్లి తమిళస్మార్తబ్రాహ్మణులైన (వడదేశస్థ) వడమశాఖలో కలసిపోయిరి. అయితే తెలుగుభాషాభిమానము, తెలుగుభాషాపరిచయము మాత్రము ఈ కుటుంబము వదలిపెట్టలేదు. కంభం ప్రాంతమునుండి వెళ్లిన వారగుటచేత వీరిని తమిళులు 'కంబట్టార్' అనుచుండిరి. కంభము నుండి వీరు చెంగల్పట్టు జిల్లా కాంచీపురమునకు వలసపోయిరి. ఆ కుటుంబమువారు ఆలయ అర్చకులుగా నియమింపబడుట కొక గాథ కలదు.

పూర్వ మొకప్పుడు బ్రహ్మ కాంచీపురమున తపస్సు చేయగా పరాశక్తి జ్యోతిరూప దర్శన మిచ్చినదట. ఆయన సంతుష్టుడై స్వయముగా శ్రీదేవి విగ్రహమును బంగారముతో చేసి కామాక్షి ఆలయమున నుంచెనట. ఆ విగ్రహమునకు బంగారు కామాక్షి యనిపేరు. ఇప్పు డా విగ్రహము తంజావూరులోని కామాక్షీదేవి ఆలయమున నున్నది. కాంచీపురమునుండి తంజావూరున కా విగ్రహము చేరుటకు చారిత్రక కారణము లున్నవి. ఈ విగ్రహము కాంచీపురమునం దుండగా దుర్వాసమహర్షి పూజించెనట. శ్రీ శంకరభగవత్పాదులు కాంచీపురమునకు వచ్చినపుడు ఆలయమున అవ్యవస్థను తొలగించి అక్కడ నివసించుచున్న శ్రీ శ్యామశాస్త్రి

పూర్వీకుని, స్మార్త బ్రాహ్మణుని, అర్చకునిగా నియమించెను. అప్పటినుండి వీరు ఆలయ అర్చకులైరి. ఇట్లు చాల సంవత్సరములు గడచినవి.

విజయనగరసామ్రాజ్యము క్రీ. శ. 1565 సంవత్సరమున పతనము చెందిన తరువాత దక్షిణభారతమున అశాంతి పరిస్థితులు నెలకొనినవి. హైందవమతమునకు, దేవాలయములకు ఉపద్రవము లేర్పడినవి. కంచికామాక్షీ దేవి ఆలయమున అర్చకులు బంగారు కామాక్షి విగ్రహమును తీసికొని నిరుపద్రవమైన స్థలములకు వెళ్లుట మంచిదని తలపోసి క్రీ. శ. 1566 సంవత్సరమున బంగారు కామాక్షి విగ్రహముతో, చతుర్భుజ ఉత్సవమూర్తితో కాంచీపురము నుండి వెళ్లిపోయిరి. వారు వలసినంత ధనసంపదలతో, కుటుంబములతో తరలివెళ్లిరి. వారు అడవులలో తమ దేవతామూర్తులతో తలదాచుకొని 28 సంవత్సరముల తదనంతరము జింజి కోటకు చేరిరి. ఆ సమయమున (క్రీ. శ. 1594) జింజిరాజు సంతాన మహారాజు. ఆయన బంగారు కామాక్షి దేవికి, ఆమెను సేవించుచున్న అర్చక బృందమునకు వసతు లేర్పాటుచేసి అనేక బహుమానముల నిచ్చెను. చాల వెండిసామగ్రి నిచ్చెను. ఆయన బహూకరించిన వెండిపాత్రలు నేటికిని తంజావూరులోని కామాక్షి ఆలయమున నున్నవి. బంగారు కామాక్షీ దేవితో జింజికోటలో 15 సంవత్సరములుండి అర్చకబృందము ఉడయార్పాళెయం సమీపాటవులకు పోయి అచ్చట 15 సంవత్సరము లుండిరి.

ఉడయార్పాళెయము జమీందారు తన పట్టణమునకు ఆహ్వానింపగా, క్రీ. శ. 1624 లో ఉడయార్పాళెయ పురమునకు వచ్చిరి. వారికి జమీందారు అన్ని సదుపాయములను

కల్పించెను. కాంచీపురమును వదిలిపెట్టిన అర్చక కుటుంబములు పది ఉడయార్పాళయము చేరునాటికి వృద్ధిపొందినవి. డెబ్బది సంవత్సరము లా పురమున నుండిరి. ఈ కుటుంబములలో కొందరిని ఉడయార్పాళయము జమీందారు అత్యాదరముతో చూచుచు మిగిలినవారిని నిరాదరణ చేసెను.

నిరాదరింపబడిన కుటుంబములవారు రహస్యముగా అణక్కుడి మిరాశిదారు స్వామినాథపిళ్లై ఆశ్రయము సంపాదించి అర్ధరాత్రి సమయమున బంగారు కామాక్షి విగ్రహముతో, తమ కుటుంబములతో ఉడయార్పాళయము నుండి పారిపోయి అణక్కుడి జమీందారీ ప్రవేశించిరి. ఆ రాత్రి స్వప్నమున అమ్మవారు వెళ్లిపోవుచున్నట్లు కనుపింపగా ఉడయార్పాళయము జమీందారుకు మెలకువ వచ్చి ఆలయమునకు పోయి తన కల సత్యమగుట తెలిసికొని చింతించెను. వెళ్లిపోయినవారిని కామాక్షి విగ్రహముతో వెనుకకు రప్పింప ప్రయత్నముచేసెను. ఫలింపలేదు. ఉండిపోయినవారిని ఆదరించి అధిక గౌరవములు చేసెను. ఇప్పటికీ ఉడయార్పాళయమునం దీ కుటుంబముల సంతతివా రున్నారు. బంగారు కామాక్షి అమ్మవారు వేంచేసియున్న మంటపము కూడ నే డున్నది.

బంగారు కామాక్షితో యీ కుటుంబములవారు అణక్కుడిలో 15 సంవత్సరము లుండి అచ్చటనుండి విజయపురము వెళ్లి అచ్చట మరియొక పదునైదు సంవత్సరము లుండిరి. విజయపురమునుండి నాగూరు, మాడపురము, సిక్కిల్ గ్రామముల ద్వారా ఒక్కొక్కచోట అయిదు సంవత్సరములు వసించుచు చివరకు తిరువారూరు వచ్చిచేరిరి. అచ్చట వారు 45 సంవత్సరము లుండిరి. తిరువారూరులో

శ్రీ త్యాగరాజస్వామి ఆలయమునం దొక ప్రత్యేకమంటపమున బంగారు కామాక్షీ దేవి విగ్రహ ముంచబడి అర్చింపబడు చుండెడిది. శ్రీ శ్యామశాస్త్రి తిరువారూరులోనే జన్మించెను.

మైసూరు పాలకుడు హైదరాలీ తన సేనలతో తిరువారూరుపై దండెత్తివచ్చుటకు యత్నించుచున్నట్లు తెలియరాగా శ్రీ శ్యామశాస్త్రి తండ్రి విశ్వనాథఅయ్యరు తంజావూరు పాలకుడైన తులజాజీరాజును (1765-1787) సంప్రతించెను. ఆ సమయమున ముఖ్య అర్చకుడు విశ్వనాథ అయ్యరు. తంజావూరురాజు అనుమతితో బంగారు కామాక్షీ విగ్రహమును తంజావూరుకోటలోనుంచి పూజించుటకు విశ్వనాథయ్యరు ఏర్పాటు చేసికొనెను. క్రీ. శ. 1781 సంవత్సరమున బంగారు కామాక్షి అమ్మవారితో, తన కుటుంబముతో విశ్వనాథయ్యరు తంజావూరు చేరెను.

కొంకణేశ్వర దేవాలయములో బంగారు కామాక్షి దేవి విగ్రహము అయిదు సంవత్సరము లుంచబడినది. అదే కాలమున పెక్కు యితర దేవాలయములనుండి కూడా విగ్రహములను తెచ్చి తంజావూరుకోటలో దాచుట జరిగినది. అనేక విష్ణ్వాలయములనుండి కూడా విగ్రహములను తెచ్చి తంజావూరులోని రాజగోపాలస్వామి ఆలయమున దాచిరి. అయితే మైసూరు పాలకుడు హైదరాలీ మరణించిన తరువాత క్రీ. శ. 1782 లో యితర ఆలయముల విగ్రహములను ఆ యా దేవాలయములకు పంపివేయుట జరిగినది. కొంకణేశ్వర దేవాలయములోని నటరాజమంటపమునుండి బంగారు కామాక్షి అమ్మవారి విగ్రహము మూల హనుమాన్ కోవెల లోనికి తీసుకుపోబడి అక్కడ మూడు సంవత్సరము లుంచ బడినది.

తరువాత ప్రత్యేక ఆలయము నిర్మింపబడి దానిలో బంగారు కామాక్షి విగ్రహము ప్రతిష్ఠింపబడినది. ప్రతిష్ఠా కుంభోత్సవముల సమయములో తంజావూరురాజు శ్రీ శ్యామ శాస్త్రి తండ్రికి ఒక అగ్రహారమును, కొన్ని పంటభూములను బహూకరించెను. ఆలయమునకు కూడ కొంతభూమిని సర్వ మాన్యముగా నిచ్చెను. ఆ దేవాలయము దాదాపు 190 సంవత్సరములుగా నున్నది. తంజావూరులో దానిపేరు శ్రీ కామాక్షీఅమ్మన్ కోవెల.

తంజావూరు మండలము, తిరువారూరులో శ్రీ శ్యామ శాస్త్రి 26 ఏప్రిల్ 1762 న జన్మించెను. అది చిత్రభాను సంవత్సరమున, మేషమాసమున కృత్తికానక్షత్ర సమయము. ఆయన గౌతమసగోత్రుడు, బోధాయన సూత్రుడు. ఆయన తాత వెంకటాద్రి అయ్యరు. తండ్రి విశ్వనాథ అయ్యరు. శ్రీ శ్యామశాస్త్రి జన్మించునాటికి ఆయన తండ్రి వయస్సు 25 సంవత్సరములు, తల్లి వయస్సు 20 సంవత్సరములు. ఆయన జననమును గురించి చిత్రమైన గాథ కలదు.

తిరువారూరుగ్రామమునం దొక భక్తుడు ప్రతి మాసమునందు చివరి శనివారమునాడు శ్రీ వేంకటాచలపతి సమారాధన చేయుచుండువాడు. ఒక సమారాధన దినమున ఆహూతుడై వచ్చిన బ్రాహ్మణు డొకడు పూనకముతో శ్రీ శ్యామశాస్త్రి తల్లిని పిలిచి "వచ్చే సంవత్సరము చైత్రమాసమున, కృత్తికానక్షత్రసమయమున నీకు పుత్రుడు కలుగును. నూరుమందికి నీవు సమారాధన చేయుము" అనెను. ఆమె "మాకు తగినంత..." అనుచుండగా నా పూనకము పూనిన బ్రాహ్మణుడు "నూరుమందికి కాకున్న ఇరువదియైదుమందికి" అని

చెప్పెను. ఆమె సంతోషముతో తిరిగి గృహమును చేరెను.

ఆ బ్రాహ్మణుడు చెప్పినట్లుగానే ఆమె గర్భవతియై తరువాత వచ్చిన మేష మాసమున కృత్తికానక్షత్ర కాలమున పుత్రుని కనెను. కృత్తికానక్షత్ర మగుటవలన నతనికి "వేంకట సుబ్రహ్మణ్య"మను పేరిడిరి. తల్లితండ్రులు ముద్దుగా "శ్యామకృష్ణు" డని పిలుచుకొనుచుండిరి. అల్లారుముద్దుగా పెంచుకొనుచుండిరి. తమ కుమారు డొక మహానుభావుడు కాగల డను భావము వారికి కలదుకాని సంగీతమునం దాతడు విశ్వవిఖ్యాతి నార్జించునని వా రనుకొనలేదు.

యుక్తవయస్సు వచ్చునప్పటి కతనికి సంస్కృతము, తెలుగు చెప్పించిరి. అతని మేనమామ సామాన్యముగా సంగీతాభిరుచి కలవాడు. ఆ మేనమామవద్గర నతడు సంగీతము నేర్చుకొనెను. పదునెన్మిదవఏట తల్లితండ్రులతో నతడు తిరువారూరునుండి తంజావూరునకు వచ్చి చేరెను.

శ్రీ శ్యామశాస్త్రి పూర్వ పురుషు లెవ్వరును సంగీతాభిరుచికలవారు కారు. వారి కుటుంబములలో నెవ్వరికి గాని సంగీతాభ్యాసమునకు ప్రోత్సాహము లేదు. అందుచేత నతడు అతిస్వల్పకాలమున మేనమామవద్గర సంగీతశాస్త్రమున ప్రాథమికవిద్య పూర్తిచేయుట నెవ్వరును గమనింపలేదు. ఈ బాలుడు అతిప్రత్యేక లక్షణము లుండి తాళపుష్టిగల ఉత్తమ సంగీతకృతుల నతడు ప్రపంచమునకు ప్రదానము చేయగలడని కుటుంబమునం దెవ్వరును తలంపలేదు. అతనికి మధురాతిమధురమైన గాత్ర మున్నప్పటికి అతనికి చక్కని సంగీత శిక్షణ యిప్పించవలయునని తల్లితండ్రులకు స్ఫురింప

లేదు. అయితే కారణజన్ములు వారికి వారే తగిన శిక్షణ యిచ్చుకొని మహనీయు లగుచుందురు.

శ్రీ త్యాగరాజస్వామికి మారువేషమున నారద మహర్షి వచ్చి స్వరార్ణవగ్రంథము నిచ్చినట్లు, శ్రీ ముత్తుస్వామి దీక్షితుని చిదంబరనాథ యోగీంద్రుడు అనుగ్రహించినట్లు శ్రీ శ్యామశాస్త్రిని సంగీతస్వామి యను మహాత్ముడు ఆశీర్వదించుట జరిగినది.

సంగీతస్వామి యను సన్యాసి యొకడు చాతుర్మాస్యమునకు తంజావూరు వచ్చెను. అతడు సంగీత, భరతశాస్త్ర నిష్ణాతుడు. కాశీలో విశ్వేశ్వర సన్నిధానమున నర్తన చేయుచు, పాటలు పాడుచు నుండువాడు. ఆయన సంగీత శాస్త్రమున ప్రగాఢమైన విద్వత్తు కలవాడు. ఈ సన్యాసి పూర్వాశ్రమమున ఆంధ్రబ్రాహ్మణుడు. దక్షిణదేశ యాత్రాసందర్భమున చాతుర్మాస్యమునకు తంజావూరులో నిలిచెను. ఆయనను విశ్వనాథయ్యరు తన గృహమునకు భిక్షకు పిలిచెను. తన కుమారుని ఆశీర్వదింపుమని కోరెను.

తనకు ప్రణామము చేసిన శ్రీ శ్యామశాస్త్రిని చూడగనే సంగీతస్వామికి అతని భవిష్యత్తు అవగాహన అయినది. తల్లితండ్రులకు ఆశ్చర్యమగునట్లుగా శ్రీ శ్యామశాస్త్రి చేయనున్న మహత్కార్యములను వివరించి చెప్పెను. అప్పటినుండి శ్రీ శ్యామశాస్త్రిని శిష్యునిగా స్వీకరించి సంగీతమున రాగ తాళ స్వర మర్మములను, ప్రస్తారక్రమములను బోధించెను.

అంతకుపూర్వమే సంస్కృత, ఆంధ్రములందు చక్కని పాండిత్యమును సంపాదించియుండిన శ్రీ శ్యామశాస్త్రి, చక్కని బుద్ధిబలము కలవాడు. నిశితమైన మేధస్సు కల

వాడు. ప్రజ్ఞానిధి. సూక్ష్మగ్రాహి. సంగీతమున సంగీతస్వామి బోధించు ప్రగాఢ విషయములను, శాస్త్రమర్మములను గ్రహింపగలశక్తి సామర్థ్యము లతనికి యేర్పడియున్నవి. అతని బుద్ధి పాదరసమువలె ప్రవహించినది. అతి శీఘ్రయానముగా నతడు రాగ, తాళ, స్వర ప్రస్తార మర్మములను తెలిసికొనెను. అతని భక్తి శ్రద్ధలకు, శక్తి సామర్థ్యములకు, సునిశిత ప్రజ్ఞా ప్రాభవమునకు సంతోషపడిన సంగీతస్వామి అతనికి అపూర్వ తాళపత్రగ్రంథముల నిచ్చెను. వాటియందు గాంధర్వ విద్యారహస్యము లెన్నియో కలవు.

చాతుర్మాస్యము ముగిసి సంగీతస్వామి తంజావూరు నుండి వెళ్లిపోవునపు డాయన శ్రీ శ్యామశాస్త్రితో, "శ్యామా! నీకు సంగీతశాస్త్రభాగ మంతయు బుద్ధికి పట్టినది. ఇపు డిక నీవు మంచి సంగీతమును వినవలెను. నీవు తంజావూరు రాజాస్థాన సంగీతవిద్వాంసుడైన పచ్చిమిరియము ఆది యప్పయ్యా స్నేహము చేయుము. వీలైనప్పు డెల్ల నాతని గాత్ర సంగీతమును వినుచుండుము. అయితే అతని దగ్గర నీ వేమియు నేర్చుకొనకుండ జాగ్రత్తపడవలయును" అని ఉద్బోధించెను. సంగీతస్వామి చాతుర్మాస్యమును ముగించుకొని తిరిగి కాశీకి వెళ్లిపోయెను.

పచ్చిమిరియము ఆదియప్పయ్యా ప్రసిద్ధుడైన విద్వాంసుడు. అయితే మంచి సంగీత అధ్యాపకుడు మాత్రము కాదు. భైరవిరాగమున అతను రచించిన "విరిబోడి" వర్ణము సంగీతప్రియుల కందరకు పరిచయమైనదే.

తన గురూపదేశము ననుసరించి శ్రీ శ్యామశాస్త్రి ఆది యప్పయ్యా స్నేహముచేసెను. ఆ కాలమున నతడు వాగ్గేయ కారశిరోమణి. వా రిద్దరికి మధ్య త్వరలోనే స్నేహము

బలిసినది. ఆదియప్పయ్యకు శ్రీ శ్యామశాస్త్రిపైన అను రాగము, అభిమానము కలిగినవి. అతడు శ్రీ శ్యామశాస్త్రిని "కామాక్షి" యని పిలిచెడువాడు.

శ్రీ శ్యామశాస్త్రి ఆదియప్పయ్య దగ్గరకు వెళ్లి నప్పు డాయన శిష్యులు వీ రిద్దరి సంభాషణకు అడ్డురాకూడదని సెలవు తీసికొని వెళ్లిపోవువారు. ఆదియప్పయ్య అప్పటికే ఏబది సంవత్సరములు దాటినవాడు. శ్రీ శ్యామశాస్త్రి కప్పుడు పదునెన్మిదేండ్లు.

ఆదియప్పయ్యకు శ్రీ శ్యామశాస్త్రిపైనున్న గౌరవ మును తెలుపు సంఘటన యొకటి యున్నది. శ్రీ శ్యామశాస్త్రికి తాంబూలప్రీతి మెండు. ఆయన సాధారణముగా తాంబూలము నములుచునే యుండెడివాడు. ఆయన దేవీభక్తుడు. శ్రీదేవి తాంబూలపూరితముఖి. ఆయన చిత్రములం దొకదానిలో ఆయన తమలపాకులు మడచి చేతితో పట్టుకొనియుండినట్లు చిత్రింపబడుట సహజ చిత్రణము. శ్రీ శ్యామశాస్త్రి యొకసారి మాటాడుచుండగా నోటినుండి తమలపాకు రసము చింది ఆదియప్పయ్య బట్టపై పడుట జరిగినది. జరిగిన తప్పిదము నకు క్షమాపణ చెప్పుకొని, ఆ తమలపాకు మరకను తుడుచుటకై నీళ్లు తెచ్చుటకు శ్రీ శ్యామశాస్త్రి పరువెత్తు చుండగా ఆదియప్పయ్య నివారించి "శ్యామా! ఇది నాకు శ్రీకామాక్షీదేవి అనుగ్రహం. నేను దీనికొరకే వేచిఉన్నాను. ఇప్పుడే నాకు నిజమైన సంగీతలోకమునకు ప్రవేశం లభించింది" అని చెప్పి తమలపాకు మరక అయిన బట్టను కూడ శ్రీ శ్యామశాస్త్రిని స్పృశింపనీయలేదు.

శ్రీ శ్యామశాస్త్రి దారిద్ర్యమెప్పు డనుభవింపలేదు. ఆయన తండ్రికి తంజావూరు మహారాష్ట్రపాలకుడు అగ్రహార

మిచ్చి లోటులేకుండ చేసినాడు. తండ్రి మరణానంతరము బంగారు కామాక్షి పూజ శ్రీ శ్యామశాస్త్రి నిర్వహింపవలసి వచ్చెను.

గొప్ప సంగీతకారుడని, మహావాగ్గేయకారుడని శ్రీ శ్యామశాస్త్రి త్వరలోనే ఖ్యాతి వహించెను. తీవ్ర విమర్శకులుకూడ ఆయన రచించిన విద్వత్పూర్ణకృతులను, స్వర జతులను విని హృదయపూర్వకముగా అభినందించెడువారు. అతిదుస్తరములైన తాళక్రమములను నిర్వహించుటలో ఆయన అద్వితీయుడు. మిక్కిలి ప్రచారమందున్న రాగముల వలెనే అపూర్వరాగములను పాడుటయందుకూడ ఆయనకున్న ప్రతిభ అపారమైనది. ఆయన తొలుత రచించిన కృతి సావేరిరాగమందున్న "జనని నతజనపరిపాలిని పాహిమాం భవాని" అనునది. ఇది సంస్కృతభాషయందున్నది. ఈ కృతివలననే ఆయన అధిరోహింపగల అద్భుతశిఖరములు సూచింపబడుచున్నవి.

ఆయన మిక్కిలి పవిత్రజీవి. శ్రీ కామాక్షి దేవియందు ఆయనకున్న భక్తి నిష్కళంకమైనది. ప్రగాఢమైనది. ఆయన శ్రీదేవితో మాట్లాడెడువాడు. శ్రీదేవి ఆయనతో మాట్లాడెడిది. శ్రీ కామాక్షీ దేవి ఆయనకు ప్రత్యక్షమూర్తి. ఆమె దర్శన మాయన కెన్నియో పర్యాయములు లభించినది. ఆమె అనుగ్రహ మాయనకు నిత్యమైనది.

ఆయన మహాపురుషుడు. శుక్రవారములందు, యితర పుణ్యదినములందు ఆయన శ్రీ దేవీపూజచేసి ప్రార్థనచేయుచు భక్తిపరవశుడై కన్నులవెంట ఆనందబాష్పములు కారుచుండ మేను మరచియుండువాడు. అట్టి భక్తిపారవశ్య సమయము లలో, లౌకిక విషయములు స్మృతియందు లేనప్పుడు ఆయన

హృదయభావప్రవాహముగా తీయని గొంతుతో, మధురమైన సంగీతముతో కమనీయమైన కృతులను గానముచేసెడువాడు. ఆ కృతులు అపూర్వప్రతిభాసమున్మేషణకు, సంగీతమాధురీ ప్రగాఢత్వమునకు, భావసాంద్రతకు సంగీతవిద్వాంసుల, భావుకుల శాశ్వత మన్ననలను పొందుచున్నవి.

శ్రీ ముత్తుస్వామి దీక్షితునికి శ్రీ శ్యామశాస్త్రి శ్రీవిద్యా రహస్యములను అనుగ్రహించెనని పరంపరాగాథ యొకటి కలదు.

శ్రీ శ్యామశాస్త్రి నిండైన విగ్రహము. ఠీవిగలవాడు. మంచి హుందాతన మున్నవాడు. చక్కని శరీరఛాయ గలవాడు. మల్లెపూవులవలె తెల్లగానున్న వస్త్రములను చిన్న జరీఅంచు కలవానిని ధరించు చుండెడివాడు. ముఖము నందు కుంకుమబొట్టు, కంఠమున బంగారుతో చుట్టిన రుద్రాక్షమాల. చెవులకు మణికుండలములు, సుందరమైన కాశ్మీరు శాలువ. వెండిపొన్నుతోనున్న చేతికఱ్ఱ, నగిషీతో కుట్టబడిన చడావులు — ఆయన వ్యక్తిత్వమున కొక అపూర్వ రామణీయకతను కూర్చిపెట్టినవి. ఆయనను ఒక్కసారి చూచినప్పటికీ మరచుట జరుగదు.

ఆయన వీధివెంట నడచి వెళ్లుచుండగా అరుగులమీద కూర్చున్నవారు లేచి నిలునబడి గౌరవము నెరపెడివారు. ఆయన నడచిపోవునప్పుడు జనము ప్రక్కలకు తప్పుకొని త్రోవ చేయుచు అసాధారణ గౌరవమును ప్రకటించువారు. ఆయన 'సంగీత సమ్రాట్టు' అని అందరంగీకరించెడువారు. ఆయన అజాతశత్రువు. అందరిచేత మన్ననలు పొందిన సిద్ధపురుషుడు.

ఆయనకు సమకాలికులైన ఉత్తమ వాగ్గేయకారులు శ్రీ త్యాగరాజు, శ్రీ ముత్తుస్వామి దీక్షితులకు చాలమంది

శిష్యులుండెడివారు. శ్రీ శ్యామశాస్త్రికి శిష్యులు తక్కువ. వారికి కూడ ఆయన శ్రద్ధగా తనకృతులన్నియు నేర్పినది లేదు. ఆయన తన శిష్యులకు తన కృతులను నేర్పియున్నయెడల ఆయన రచించెనని భావింపబడుచున్న మూడువందల కృతులు మనకు లభ్యమయ్యెడివి.

ఆయన ప్రశాంత జీవితమునం దభిలాష కలిగి యుండెను. లౌకికమైన సంగము వాంఛించెడువాడు కాడు. ఆయనకు లేమిబాధ లేదు. సంగీతమువలన ఉదరపోషణము చేసికొనవలసిన ఆవశ్యకత లేదు. ఆయన రాజుల అనుగ్రహము కావలెనని ప్రయత్నింపలేదు సరికదా రాజులకు దూరముగా నుండ ప్రయత్నించెను. ఆయన నరస్తుతి చేసి యెరుగడు.

శ్రీ శ్యామశాస్త్రి శ్రీ త్యాగరాజు సన్నిహిత మిత్రులు. శ్రీ శ్యామశాస్త్రి అప్పుడప్పుడు తిరువైయారులో శ్రీ త్యాగరాజు గృహమునకు వెళ్లివచ్చుట కలదు. శ్రీశ్యామశాస్త్రి రాకను శ్రీ త్యాగరాజు శిష్యులలో చిన్న వయస్సువారు చూచి "ఈనాడు మాకు సాయంకాలముననే భోజనము" అనుకొనుచుండిరి. ఈ ఉత్తమవాగ్గేయకారు లిద్దరు గంటలతరబడి మాటలాడుకొనుచుండెడివారు. అందుచేత భోజనమునకు లేచుటకు ఆలస్యమయ్యెడిది. వారు అన్యోన్యము సంగీతవిషయములను గురించి సంప్రదించు కొనుట, సంవదించుకొనుట, సంపరీక్షణము చేసికొనుట చేయుచుండెడివారు. వయస్సుండి పండితులైన శిష్యుల కట్టి అవకాశము అలభ్యయోగమై ఆనందదాయక మగుచుండెడిది.

శ్రీ శ్యామశాస్త్రి నొక మిత్రుడు పుదుకోటకు ఆహ్వానించెను. అక్కడ బృహదంబ దేవాలయమున అమ్మ వారిని దర్శించుచుండగా అపరిచితవ్యక్తి యొక డేతెంచి

"మధురలోని శ్రీ మీనాక్షి సన్నిధానమునకు వెళ్లి ఆమెను స్తుతించుచు కొన్ని కృతులను రచింపు"మని కోరెను. శ్రీ శ్యామశాస్త్రి అది శ్రీ దేవిఆజ్ఞ యనుకొని అట్లు చేయుటకు నిశ్చయించుకొనెను.

తంజావూరు తిరిగి వచ్చిన తరువాత మధురసంగతి మరచిపోయెను. కొన్ని నెలలు గడచినవి. ఒకనాటిరాత్రి స్వప్నమున మరల నా అపరిచితవ్యక్తి కన్పించి మధుర మీనాక్షి సన్నిధానమునకు వెళ్లవలసి యున్నదని జ్ఞాపకము చేసెను. శ్రీ శ్యామశాస్త్రి వెంటనే నిద్రలేచి మరచిపోవుట జరిగినందులకు చింతించి వెంటనే కృతులను రచించుటకు పూనుకొనెను. మరునాడే తనశిష్యుడైన అలసూరు కృష్ణయ్యరును వెంటబెట్టుకొని మధురకు ప్రయాణమై వెళ్ళెను. త్రోవలో శ్రీమీనాక్షి దేవిపై తొమ్మిది కృతులను పూర్తిచేసెను. ఆ కృతులకు ఆయన "నవరత్న మాలికా కృతు"లని నామకరణముచేసెను.

ఆయన కదే మధురకు పోవుట మొదటిసారి. అచ్చట ఆయనకు పరిచితులు లేరు. ఆయన శిష్యసహితుడై ఆలయమును చేరి అమ్మవారి సన్నిధానమున కెదురుగా నిలువబడి కృతులను గానముచేయుట ప్రారంభించెను. ఆయన నెవరో సామాన్యుడైన గాయకుడనుకొని అర్చకులుగాని, ఆలయమునకు వచ్చిన జనులుగాని పట్టించుకొనలేదు. అప్పటికే ఆయన ఖ్యాతి దక్షిణ భారతమున వ్యాపించియున్నను ఆ గానముచేయుచున్న గాయకుడే శ్రీ శ్యామశాస్త్రి యని వారికి తెలియదు. నాలుగు కృతులు పాడి అయిదవ కృతి ఆహిరి రాగమునకు వచ్చునప్పటికి ఆయన గానము దివ్య గాంధారమధుర ప్రవాహమై శ్రోతలందరికి ఆనంద తన్మ

యత్న్యము కలిగించినది. అందరును పరమానందభరితులైరి. ఆయన భక్తి పారవశ్యమునకు, గాత్ర మాధుర్యమునకు, విద్యావైదుష్యమునకు అమ్మవారికే దయాస్పందనమైనది. అర్చకులం దొకడు పరవశుడై "ఇదిగో, ఈయన అమ్మవారికి అంతరంగికుడైన మహాభక్తుడు. ఈయనను దేవాలయ మర్యాదలతో సత్కరింపవలెను" అని ఆవేశముతో పలికెను.

శ్రీ శ్యామశాస్త్రి ప్రక్కనున్న శిష్యునివలన ఆయన వాగ్గేయకార సార్వభౌముడైన శ్రీ శ్యామశాస్త్రి యని తెలిసికొని అర్చకులు, ఆలయమునందున్న జనులు ఆనందపులకితులై ఆయనకు బహువిధ గౌరవములను నెరపిరి. ఆలయ మర్యాదలతో ఆయనకు అపూర్వ సన్మాన గౌరవములు జరిపిరి. ఆయన కృతులను బహుధా ప్రశంసించిరి. ఆనాటి నుండి శ్రీ శ్యామశాస్త్రి వంశమువారిని ఆలయ మర్యాదలతో సత్కరించుట శ్రీ మీనాక్షీదేవి ఆలయమున ఆచారమైనది.

ఆయన శ్రీ మీనాక్షీదేవిపై రచించిన నవరత్న మాలికా కృతులలో ఏడు కృతులు మిక్కిలి ప్రచారము నందున్నవి. అవి :

| | | |
|---|---|---|
| 'సరోజ దళనేత్రి' | శంకరాభరణ రాగము | ఆదితాళము |
| 'దేవిమీననేత్రి' | శంకరాభరణ రాగము | ఆదితాళము |
| 'మరి వేరేగతి' | ఆనంద భైరవి రాగము | చాపుతాళము |
| 'నన్ను బ్రోవు లలితా' | లలితా రాగము | మిశ్రలఘుతాళము |
| 'మాయమ్మ' | ఆహిరి రాగము | ఆదితాళము |
| 'దేవి నీదు పదసారస' | కాంభోజి రాగము | ఆదితాళము |
| 'మీనలోచన బ్రోవ' | ధన్యాసి రాగము | చాపుతాళము |

కర్ణాటక సంగీత రత్నత్రయమున శ్రీ శ్యామశాస్త్రి కృతులకు రావలసినంత ప్రచారము రాకపోవుటకు రెండు కారణము లున్నవి.

మొదటి కారణమేమనగా శ్రీ శ్యామశాస్త్రి కృతులు విద్వత్తుతో కూడినవి. తాళక్రమ విషయమున అత్యంత గాఢ గంభీరములైనవి. సంగీతసాధనలో మిక్కిలి పండిన వారికిగాని ఆ కృతులను అవగాహనచేసికొని నిర్దుష్టముగా పాడుట సాధ్యముకాదు. శ్రీ శ్యామశాస్త్రి కృతులలో కొన్నిటిని నిర్దుష్టముగా పాడగలిగిన గాయకుడు గొప్ప విద్వాంసుడని అంగీకరింతురు. సంగీతశాస్త్ర విద్వాంసులకు ఆయన కృతులు ప్రమోదహేతువులు. సంగీతశాస్త్ర మర్మముల నెరుగని సామాన్యజనుల కాయన కృతులు విని ఆనందించుట, ప్రశంసించుట సాధ్యముకాదు. ఆయన కృతులలోని శ్రేష్ఠత్వమును సంగీతపారమ్యమును అవగాహన చేసికొనుట, ఆనందించుట సంగీతశాస్త్రమున కృషిచేసిన వారికి మాత్రమే పరిమితమై యున్నది. ఆయన కృతులలో చాలభాగము దివ్యావేశభరితుడై యున్నపుడు రచింపబడినవే. శ్రీ త్యాగరాజు కృతులు కూడ నిట్టివే. అందుచేత వాటి వెనుకనున్న మనోధర్మము గొప్పది. ఆవిధమైన కృతు లన్నియు భావపుష్టి కలిగినవి.

ఆయన కృతులలో మాంజి, కల్గడ, చింతామణి మొదలగు అపూర్వరాగములందున్న కృతులవలన ఆయన మహాప్రతిభావంతుడైన ఉత్తమ విద్వాంసుడని, అన్యులకు చొరరాని దుర్గహములైన శాస్త్రాటవులలో ఆయన సుందర ఉద్యానవనములను నిర్మించి చూపగలవాడని నిరూపింప

బడుచున్నది. ఆయన రచనలు చౌకకాలమునందు, మధ్యమకాలమునందు కలవు.

ఆయన కృతులకు రావలసినంత ప్రచారము రాక పోవుటకు మరియొక కారణ మేమనగా శ్రీ శ్యామశాస్త్రిగారికి తగినంతమంది శిష్యులు లేరు. వాగ్గేయకారుని కృతులు శిష్యులు నేర్చుకొని సభలలో పాడి మెప్పించినప్పుడుకదా వాటికి ప్రచారము లభించుట. అందుచేత ఎక్కువమంది శిష్యులున్న వాగ్గేయకారుని కృతుల కెక్కువ ప్రచారము లభించుట కెక్కువ అవకాశ మున్నది. ఈ కారణమువలననే శ్రీ త్యాగరాజకృతులు త్వరలో దేశమున వ్యాపించినవి. శ్రీ త్యాగరాజునకు మహాపండితులైన శిష్యులు ఇరువది నాలుగుమంది యుండిరి. వారు శ్రద్ధా భక్తులతో గురువును సేవించి ఆయన కృతులను నేర్చుకొని తమ తమ ప్రాంతము లలో పెక్కుమంది సంగీతకారులకు నేర్పిరి. మరియు శ్రీ త్యాగరాజునకు బహుప్రాంతములనుండి శిష్యులు వచ్చుట కూడ ఆయన కృతులు దేశమున విస్తరించుటకు కారణమే. శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కృతులు ఆయన తమ్ములవలన, వంశపారంపర్యా వచ్చిన విద్వాంసులవలన, శిష్యులవలన ప్రచారములోనికి వచ్చినవి.

శ్రీ శ్యామశాస్త్రిగారి కృతులను మరిమరి పరిశీలించిన గాని వాని గొప్పదనము గ్రాహ్యముకాదు. ఆయన శైలి శ్రీ త్యాగరాజు శైలివలె సులభసుందరమైన మాధుర్య రస ప్రవాహము కాదు. శ్రీ ముత్తుస్వామి దీక్షితుల శైలివలె క్లిష్టశ్రామికనిర్మాణమును కాదు. శ్రీ శ్యామ శాస్త్రి సంస్కృత ఆంధ్ర తమిళములందు కృతులు రచించెను. ఆయన కృతులపై తేలికగా రాగస్వరూపము

ఆయన "స్వరజతి" నిర్మాణ నిపుణుడు. ఇది పూర్వము నాట్యమునకు పరిమితమై యుండెడిది. దానిని శ్రీ శ్యామశాస్త్రి (జతులను తొలగించి) సంగీతరూపమునకు మార్పుచేసెను. ఆయన రచించిన మూడు స్వరజతులు, (1) రావె, హిమగిరికుమారి (తోడిరాగము, ఆదితాళము) (2) కామాక్షిఅనుదినము (భైరవిరాగము, చాపుతాళము) (3) కామాక్షి నీదు పదయుగమె (యదుకులకాంభోజి రాగము, త్రిపుటతాళము) అనునవి సంగీతచరిత్రలోనే నిరుపమానములు. రాగ భావ ప్రస్తారమునందు, సంగీత భావసంపన్నతయందు సాటిలేనివి.

భైరవిరాగ స్వరజతియందు ఎనిమిది చరణములయొక్క ప్రారంభస్వరములు వరుసగా స, రి, గ, మ, ప, ద, ని, స ఆరోహణక్రమమునం దున్నవి. ఆయన రాగాలాపనలో ఆరోహణస్థాయి పద్ధతిని వీనియందు ప్రదర్శించెను.

యదుకులకాంభోజిరాగ స్వరజతియందు చివరి చరణము ముగింపునం దొక మకుటము, కిరీట మున్నది. అనగా భిన్నస్థాయిలందున్న ఖండం (5), మిశ్రం (7), సంకీర్ణం (9) రి గ స / మ గ రి స ని ద ప / మ గ రి స ని ద ప మ గ. ఈవిధమైన సంక్లిష్టవర్గీకరణము కృతియొక్క నిర్మాణ వైభవమునకు తగినట్లున్నది. ఈ మూడు స్వరజతులకు "రత్నత్రయ" మని ప్రసిద్ధి.

రాగమునకు వర్తమానకాలస్వరూపమును తెచ్చిన వాడు శ్రీ శ్యామశాస్త్రి. ఆనందభైరవి చాల పాతరాగము. దీనియందు జానపదగేయములు, లాలిపాటలు కూడ కలవు. పాతకాలమునాటి ఆనందభైరవిరాగ రచనలను పరిశీలించిన చో నేటి శాస్త్రజ్ఞుల దృష్టిలో దోషములుగా భావింపబడు

చున్న ప్రయోగములు కన్పించుచున్నవి. 'కమల సులోచన' అను పూర్వ ఆనందభైరవిరాగగీతమున చాల ఆర్షప్రయోగము లున్నవి. అనగా యిప్పటి శాస్త్రజ్ఞులు దోషములుగా భావించునవి. భద్రాచల రామదాసు ఆనంద భైరవిరాగ కీర్తనలో తారస్థాయియం దొక క్రొత్త ప్రయోగము ప్రవేశపెట్టెను. శ్రీ ముత్తుస్వామి దీక్షితుల తండ్రి రామస్వామి దీక్షితులు తనకృతియొక్క చిట్టస్వరమున ఒక క్రొత్తప్రయోగము ప్రవేశపెట్టెను. 'పాహి శ్రీరామ చంద్ర' అను ఆనందభైరవిరాగగీతమున పెడాల గురుమూర్తి ఒక ప్రయోగమును ప్రవేశపెట్టెను.

శ్రీ శ్యామశాస్త్రి శుద్ధమార్గమున పయనించి ఆనంద భైరవిరాగ స్వచ్ఛస్వరూపమును ప్రదర్శించెను. ఆభేరిరాగ అవతరణము తరువాత ఆనందభైరవిరాగమున కొన్ని ప్రయోగములకు స్థానము లేదు.

ఆనందభైరవిరాగ ప్రగాఢత్వ, పరిపూర్ణ మాధుర్య స్వరూప నిరూపణకు శ్రీ శ్యామశాస్త్రి ఆనందభైరవిరాగ కృతులు (1) ఓ జగదంబ (2) పాహి శ్రీ గిరిరాజసుతే (3) మరివేరేగతి (4) హిమాచలతనయ బ్రోచుట అను నవియు, 'సామిని రమ్మనవె' అను వర్ణము అత్యుత్తమ స్థానమం దున్నవి.

ఆనందభైరవి రాగము శ్రీ శ్యామశాస్త్రిగారి సొత్తు అని విజ్ఞుల అభిప్రాయము. ఆయన కృతులలో సంగీతము యొక్క నైగనిగ్యము ప్రత్యేకత. ఆయన కృతులు లక్షణమునకు ఉదాహరణములు. స్వరసాహిత్యకల్పనలో ఆయన అద్వితీయుడైన ప్రతిభాసంపన్నుడు.

సరిపోవునట్లుగా పాడవచ్చు నన్నమాట. ఏ తాళములో పాడినను సాహిత్యము, భావము చెడవు. కాని యీ రెండు తాళములలో నొకటి స్థాపిత తాళము. రెండవది సూచిత తాళము. సావేరిరాగమునందున్న "శంకరి శంకరు" అను కృతి మంచి ఉదాహరణము. దీనికి రూపకము స్థాపిత తాళము. ఆదితాళము (తిస్రగతి) సూచిత తాళము. ఆయన ఈ రెండు తాళములను ఉద్దేశించినట్లు నిదర్శనముగా పల్లవి, అనుపల్లవి రూపకతాళానుకూల సహజ స్వరూపములు. చరణము ఆదితాళ (తిస్రగతి) అనుకూల సహజస్వరూపముకలది. ఆయన కృతులలో అతీత అనాగత సంక్లిష్టము లున్నవి. ఆయన లయబ్రహ్మ. తాళప్రస్తారలోక గగనవిహారి.

ఆయన కృతులలో పెక్కుచోట్ల స్వరాక్షరము లున్నవి. స్వరముయొక్క అక్షరము, సాహిత్యముయొక్క అక్షరము ఒక్కటే అయినప్పుడు కల్పింపబడు సౌందర్య మిది. ఇది యొక నిర్మాణ శిల్పసౌందర్యము. ఇది ధాతు మాతు సంయుక్త అలంకారము. దీనికి పెక్కు ఉదాహరణము లున్నవి.

1. 'దేవి బ్రోవ సమయ మిదే' అను చింతామణి రాగ కృతిలో మొదటి చరణమున 'నీ దాసుడుగద' అను పదసమూహ మున్నది. ఇందు నీ–దా స్వరాక్షర కల్పన.

2. ఆయన సావేరిరాగ ఆదితాళ కృతి (దురుసుగ) సూచితస్వరాక్షర శిల్పకల్పన కొక చక్కని ఉదాహరణము.

ఒక పర్యాయము శ్రీ శ్యామశాస్త్రి శిష్యులు కొందరు శ్రీ త్యాగరాజు కడకుపోయి తమ గురువుగారి కీర్తనలను కొన్నిటిని పాడి విన్పించిరట. ఒకటి రెండుచోట్ల వారు లయ తప్పిరట. శ్రీ త్యాగరాజు వారి పాటను ఆపి "మీరు

మీ గురువుగారి కృతిలోని లయభావమును అవగాహన చేసి కొనలేదు. మీ పాటవలన ఆ కృతులకు ద్రోహము జరుగు చున్నది. మీరు గురుద్రోహులు ” అనిచెప్పి పంపెనట. ఈ సంఘటనను పురస్కరించుకొని శ్రీ త్యాగరాజు చెంచు కాంభోజి రాగమున “వరరాగలయజ్ఞులు” అను కృతి రచించెనని జనశ్రుతిగాథ.

శ్రీ శ్యామశాస్త్రికి ఆనందభైరవి రాగముపై ప్రత్యేకాభిమానమున్నట్లు తోచును. ఆధునిక వాగ్గేయకారులలో ఆనందభైరవి రాగమున ఎక్కువ కృతులను రచించిన వా డాయన. సంగీతసృజనాత్మకశక్తిగల వాగ్గేయకారుని కల్పనలో చిన్నరాగములకు, పెద్దరాగములకు భేదము లేదని శ్రీ శ్యామశాస్త్రి ఆనందభైరవిరాగకృతులను చూచిన తెలియ నగును. ‘సామిని రమ్మనవె’ అను ఆనందభైరవి (అటతాళము) తాన వర్ణము కంచి వరదరాజస్వామివారిపై స్తుతి. తాళములలో ఆయనకు చాపుతాళమునం దెక్కువ అభిమానము. ఆయన కృతులు, స్వరజతులు చాపుతాళమునం దెక్కువ.

రసభావదృష్టితో పరిశీలింపగా శ్రీ త్యాగరాజు కృతులు ద్రాక్షాపాకమునం దున్నవని, శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కృతులు నారికేళపాకమునం దున్నవని, శ్రీ శ్యామ శాస్త్రి కృతులు కదళీఫలపాకమునం దున్నవని సంగీత భావుకులు అభిప్రాయపడుచున్నారు.

“హిమాద్రిసుతే” (సంస్కృతము), “బిరానవరాలిచ్చి” (తెలుగు) అను రెండు కృతులకు (కల్యాణి రాగము, రూపక తాళము) ఒకే రాగప్రస్తార, లయప్రస్తారాదు లున్నవి.

తంజావూరు సంగీత విద్వాంసులకు భయమును కలిగించినవి. వారందరు తమలో తాము ఆలోచించుకొని కేశవయ్యను తా మెవ్వరు జయింపజాలరని శ్రీ శ్యామశాస్త్రి మాత్రమే జయింప గలడని నిశ్చయించుకొనిరి. తంజావూరు గౌరవమునునిల బెట్టుట శ్రీ శ్యామశాస్త్రిచేతిలో నున్నదని వారు గ్రహించిరి.

వా రందరు సమిష్టిగా వెళ్లి శ్రీ శ్యామశాస్త్రిని దర్శించి తమకు వచ్చిన ఆపదను వివరించి తంజావూరు సంగీత గౌరవమును రక్షించుటకై ఆయన కేశవయ్యను జయింప వలెనని ప్రార్థించిరి. శ్రీ శ్యామశాస్త్రి రాజాదరణ కోరు వాడు కాదు. ఆయన దర్బారునకు వెళ్లడు. ఆయనకు ధనసహాయము కావలసినప్పుడైనను రాజ సంబంధము పెట్టుకొనలేదు. ఆయనకు అధికధనవంతులైన మిత్రులు ఒకరు తిరువడమరుదూరులోను, మరి యొకరు పుదుక్కోట లోను నుండిరి. ఆయన కోరకుండ ధనసహాయము చేయుటకు సిద్ధముగా నుండిరి. అందుచేత శ్రీ శ్యామశాస్త్రికి తంజావూరు రాజాదరణము రాజదర్శనము ఆవశ్యకత కాదు. అయితే స్వస్థలమైన తంజావూరు సంగీత గౌరవమును సంరక్షింప వలసిన ఆవశ్యకత కలదని ఆయన గుర్తించి బొబ్బిలి కేశవయ్యతో సంగీతవిద్యలో వివాదముచేయుట కంగీకరించెను.

వివాదము మరునాడు జరుగనున్న దనగా శ్రీ శ్యామ శాస్త్రి మనస్సునకు కొంత అశాంతి కలిగినది. బాగుగా ఆలోచించెను. కేశవయ్య శక్తి సామర్థ్యములను గురించి ఆస్థాన విద్వాంసులు ఎక్కువగా చెప్పిరి. అందుచేత శ్రీ శ్యామశాస్త్రికికూడ కొంత అనుమానము, భీతి

ప్రారంభమైనవి. స్వీకరించిన బాధ్యత అమిత భారమైనదని గ్రహించెను.

ఒక సాయంకాలము శ్రీదేవి పూజచేసి ఏకాంతముగా ఆమె ముందు కూర్చుని తనస్థితిని ఆమెకు చెప్పుకొని తన్ను రక్షింపు మని త్రికరణశుద్ధిగా శరణు వేడెను. అప్పుడు కృతి యొకటి ఉబికి వచ్చినది. చింతామణి రాగమున (రూపకతాళ) 'దేవి బ్రోవ సమయ మిదే' అను కృతి యది. ఆయన పరవశుడై దానిని అమ్మవారి ముందు గానము చేసెను. ఆ కృతిలోని భావస్థితిని బట్టి ఆయన మనోధర్మము విస్పష్టమాన మగుచున్నది. అమ్మవారికి కరుణ కలిగినది. ఆమె తన్ను రక్షించుటకు పూనుకొన్నదని, తనకు విజయము లభించునని శ్రీ శ్యామశాస్త్రి తెలుసుకొనెను. సంతోషముతో గృహమునకు తిరిగివచ్చెను.

'చింతామణి' రాగమున కృతి పాడుట కడు సమంజసముగానున్నది. కల్పవృక్షమువలె, కామధేనువువలె చింతామణి కోరిన కోర్కెలను తీర్చునది. చింతామణి రాగమున ప్రసిద్ధ వాగ్గేయకారు లెవ్వరు కృతులు రచించి యుండలేదు.

మరునాడు ఉదయముననే శ్రీ శ్యామశాస్త్రికి, కేశవయ్యకు రాజాస్థానమున సంగీతపోటీ జరుగునని ఊరెల్ల తెలిసినది. సంగీతకారులు, సంగీత రసికులు, భావుకులు వేలాదిగా దర్బారునకు వచ్చి వేచియుండిరి. తంజావూరు మహారాజు, ప్రజలు తంజావూరు సంగీత గౌరవమును రక్షింపుమని లోలోన భగవంతుని ప్రార్థించిరి.

శ్రీ శ్యామశాస్త్రి నిత్యప్రార్థనలు చేసి అమ్మవారి ప్రసాదము స్వీకరించి కుంకుమ ధరించి దర్బారునకు వెళ్లెను.

అప్పటికే గుమిగూడిన సభాస్తారులు ఆయనను చూచి నిలువబడి హర్షధ్వానములు చేసిరి. శ్రీ శ్యామశాస్త్రి సభలో కేశవయ్యకెదురుగా కూర్చుండెను. సభ నిశ్శబ్దమైనది. మహారాజు అమూల్య రత్నాభరణములను వెండిపళ్లెములో గెలిచినవారి కిచ్చుటకు సిద్ధముగా నుంచెను.

పోటీ ప్రారంభమైనది. కేశవయ్య తంబురాను శ్రుతి చేసికొని ఒక రాగ మెత్తుకొనెను. ఆలాపనతో తానము పాడుచు భిన్నభిన్న జాతుల గతుల ప్రదర్శించి శీఘ్రవిలంబ నాదుల చూపెను. కేశవయ్య గొప్ప గాత్రసంగీత విద్వాంసుడు. అనేక సంగతులతో తన విద్వత్తు చూపెను. అనేక సంవత్సరములు నిరంతరాభ్యాసము చేసిన బహు క్లిష్ట సంచారములను చూపెను.

కేశవయ్య తన విద్వత్తును చూచి ప్రత్యర్థి భయపడి పరాజయ మంగీకరించు ననుకొనెను. కేశవయ్య పాట నిలిపినంత శ్రీ శ్యామశాస్త్రి "ఇంతేనా, ఇంకా ఉన్నదా?" అనెను. కేశవయ్య మాట్లాడలేదు. అంత శ్రీ శ్యామశాస్త్రి ప్రారంభించి కేశవయ్య చూపిన తానము లన్నీ లీలగా పాడి చూపించి, అతడు అడుగుపెట్టని నూత్నలోకములకు గొనిపోయి అద్భుత సామర్థ్యమును ప్రదర్శించెను. తరువాత లయాంతర్లీనమైన బహువిధమైన గమకములను చూపెను. కేశవయ్యకు వీని స్థితి తెలియనే తెలియదు.

కేశవయ్య సంగీతము ఘనమైన దనీ, ఆలోచన లేకె త్రించుచున్న దనీ, కాని క్షుణ్ణమార్గమునందున్న దనీ సభికులు భావించిరి. శ్రీ శ్యామశాస్త్రి సామర్థ్యము అంతకంటె పై అంతస్థు దనీ, ఆయన సృజనాత్మకశక్తి అద్భుత

మైన దనీ, ఆయన ఊహాభావములు అపారముగానున్న వనీ సభికులు గ్రహించిరి.

వారిద్దరు చాలసేపు పెనగులాడినారు. తేలలేదు. శీఘ్రంగా జయాపజయాలు తేలవలెనని సభ్యులు తొందరపడినారు. వారిద్దరు సభ్యుల భావములు గ్రహించినారు.

ఒకరి నొకరు మూడు ప్రశ్నలు వేసుకోవడానికి నిశ్చయించుకొన్నారు. కేశవయ్య పాట ప్రారంభించెనుకాబట్టి శ్రీ శ్యామశాస్త్రి ప్రశ్నించడం ప్రారంభించినాడు.

శ్రీ శ్యామశాస్త్రి "నీవు శాస్త్రీయముగా పాడగలవా" అని ప్రశ్నించెను. అంత గొప్పవిద్వాంసుని ఇటువంటి ప్రశ్న వేయుట సముచితము కాదు.

"ఓ, తప్పకుండా పాడగలను" అన్నాడు కేశవయ్య. "అయితే కొంచెమైనా తల త్రిప్పకుండా తానం పాడు" అని శ్రీ శ్యామశాస్త్రి అన్నాడు. గానముచేయునప్పుడు తల త్రిప్పరాదు. చేతులు త్రిప్పుట మొదలైనవేమియు చేయరాదు. ఇవి యన్నియు గాయకదోషములు.

కేశవయ్య తిరిగి పాడుట ప్రారంభించాడు. చిరకాలముగా తలత్రిప్పుట కలవాటుపడిన కేశవయ్య తలత్రిప్పకుండా పాడలేకపోయాడు. అతనిని అశాంతి చుట్టుముట్టింది. ఇప్పుడతడు శ్రీ శ్యామశాస్త్రిని ప్రశ్నింపవలసియున్నది.

కేశవయ్య సింహానందన తాళమున ఒక పల్లవి పాడి శ్రీ శ్యామశాస్త్రిని దానిని తిరిగి పాడమన్నాడు. శ్రీ శ్యామశాస్త్రి అవలీలగా, నిర్దుష్టంగా ఆ పల్లవిని స్ఫుటంగా, అతి పరిచితమైనట్లుగా పాడినాడు.

శ్రీ శ్యామశాస్త్రి శరభనందన తాళమున నొక పల్లవిని పాడి తిరిగి కేశవయ్యను దానిని పాడ మన్నాడు. కేశవయ్య దానిని నోట అనలేకపోయాడు. అంతవరకు పూర్వ మెప్పుడు వినలేదు. దానిని శ్రీ శ్యామశాస్త్రి నిర్మించాడో లేక తన గురువు సంగీతస్వామినుండి నేర్చుకున్నాడో. దానికి షోడశాంగము లున్నవి. వాటి ఉపయోగమే చిత్రముగా నున్నది కేశవయ్యకు. ఈ తాళము 19½ మాత్రలను, 79 అక్షర కాలాలను ఒక ఆవర్తమునకు తీసుకుంటుంది. ఆ తాళము యొక్క స్వరూప మిట్లా ఉన్నది.

గురు, లఘు, ద్రుతము, లఘు, లఘు, ద్రుతము, అనుద్రుతము, లఘు విరామం, ద్రుతము, ద్రుతము, ద్రుతము, అనుద్రుతము, లఘు ద్రుతము, లఘు ద్రుతం విరామం, లఘు విరామం, ద్రుతము, అనుద్రుతము, ద్రుతము, అనుద్రుతము, ద్రుతము, లఘు విరామం, ద్రుతము, ద్రుత విరామం, లఘు ద్రుతం ( 24 అంగములు ).

సింహానందన తాళమునకు ప్రతిగా శరభనందన తాళమును ఉపయోగించుట సమంజసమే. నృసింహావతారమున విష్ణువు హిరణ్యకశిపుని రక్తము త్రాగి రాక్షసత్వమున విజృంభింపగా ముల్లోకములు తల్లడిల్లినవి. పరమేశ్వరు డప్పుడు శరభాకారమున ( సింహముఖ పక్షి, 8 కాళ్లు ) వచ్చి నృసింహుని గోళ్లతో పైకెత్తి రాక్షస రక్తాన్ని పీల్చి నృసింహుని సౌమ్యుని చేశాడు.

శరభనందన తాళముతో సింహానందన తాళము పాడిన కేశవయ్య పరాజితుడైనాడు. మహారాజు శ్రీ శ్యామశాస్త్రికి అనేక బహుమానము లిచ్చి గౌరవించాడు.

ఆస్థాన విద్వాంసులు శ్రీ శ్యామశాస్త్రికి కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

శ్రీ శ్యామశాస్త్రిని గురించి మరి కొన్ని అద్భుత గాథ లున్నవి.

నాగపట్టణమున అప్పుకుట్టి అను నాట్యాచార్య డొక డుండెడివాడు. అతడు గొప్ప సంగీతవిద్వాంసుడు. కన్పించిన సంగీతకారులను ప్రతిఘటించి, అవమానించుట వానికి ప్రీతి. ఒకపర్యాయము శ్రీ శ్యామశాస్త్రి నాగపట్టణమునకు వెళ్లగా అక్కడ విద్వాంసు లాయనను దర్శించి అప్పుకుట్టి గర్వభంగము చేయు డని ప్రార్థించిరి.

నీలాయతాక్షి ఆలయమున సమావేశము ఏర్పాటు చేయబడినది. శ్రీ శ్యామశాస్త్రి పరాజయము పొందినచో సన్న్యాసియై వెళ్లిపోవలయు నని, అప్పుకుట్టి పరాజయము పొందినచో తంబురాను, తాళములను సమర్పించి, నాట్యవృత్తిని విసర్జించవలయు నని శపథములు జరిగినవి.

శ్రీ శ్యామశాస్త్రి ముందు నాట్యగాడు నిలువలేక పోయెను. చిన్నపల్లవితోనే అతనికి పరాభవమైనది. అప్పుకుట్టి నాగపట్టణము వదలిపెట్టి మైసూరు వెళ్లి అక్కడ రాజాదరణమును పొందెను. అప్పుకుట్టి సజ్జనుడు. విద్యాప్రాభవ మెరిగినవాడు. మైసూరు మహారాజుతో శ్రీ శ్యామశాస్త్రిని గురించి చెప్పెను. మహారాజు శ్రీ శ్యామశాస్త్రిని చూడ ముచ్చటపడెను. అప్పుకుట్టి శ్రీ శ్యామశాస్త్రి కడకు వచ్చి తనకు మైసూరు మహారాజిచ్చిన పతకములు, బహుమానములు ఆయనకు సమర్పించి సాష్టాంగప్రణామము చేసి మైసూరు మహారాజు కోరికను విన్నవించి శ్రీ శ్యామ

శాస్త్రికి మైసూరు రాజసభలో కనకాభిషేకము జరుప దలచినట్లు చెప్పెను.

శ్రీ శ్యామశాస్త్రి "నాకు రాజానుగ్రహము లెందుకు? నాకు వయస్సు వచ్చినది. కాలము ముగియబోవుచున్నది. నేను రాజాలను" అని చెప్పి పంపెను. అప్పుకుట్టి నిరాశుడై తిరిగి వెళ్లెను.

శ్రీ శ్యామశాస్త్రి చిరుతకాలమునాటి వృత్తాంత మొకటి కలదు. చిన్నప్పు డొకనాడు తండ్రి పనిమీద గ్రామాంతరము వెళ్లగా శ్రీ శ్యామశాస్త్రి అమ్మవారికి పూజ చేయుచుండెను. ఒకభక్తుడు ఆలయమునకు అర్చన చేయించుటకు వచ్చెను. శ్రీ శ్యామశాస్త్రి మంత్రములు గానము చేసెను. ఆ భక్తుడు పరవశుడై పోయెను. అత డొక చక్కని విలువగల శాలువను తెచ్చి శ్రీ శ్యామశాస్త్రికి బహూకరించెను. శ్రీ శ్యామశాస్త్రి కృతజ్ఞతతో స్వీకరించెను.

ఆ శాలువను కప్పుకొని తనకు సంగీతము నేర్పిన మేనమామ దగ్గరకు పోయి ప్రణామముచేసి శాలువను చూపించి జరిగిన సంగతిని చెప్పెను. ఆ మేనమామ సంతోషించుటకు బదులు మాత్సర్యగ్రస్తుడై చిరచిర లాడెను. శ్రీ శ్యామశాస్త్రి కన్నులవెంట నీరు కారినది. అత డీ అవమానమునకు దుఃఖపడెను.

తండ్రి తిరిగి వచ్చిన తరువాత ఆయనతో అంతయు చెప్పెను. తండ్రి ఉపశమనవాక్యములను చెప్పుటకు బదులు "నాయనా, శ్యామా! మనకు కులవృత్తికాని యీ సంగీత మెందుకురా? మన కులవృత్తిని బాగుగా చేయుట మన ధర్మము" అనెను. శ్రీ శ్యామశాస్త్రి తలదించుకొని

అమ్మవారి దగ్గరకు పోయి, తన దుఃఖమును వెళ్ళబోసికొనెను. ఆమె దృష్టిలో ఆయనకు ఉపశమనము కలిగినది.

శ్రీ శ్యామశాస్త్రి గొప్పజ్యోతిషశాస్త్రవేత్త. నిగ్రహానుగ్రహదక్షుడు. ముఖము చూచి భవిష్యత్తు చెప్పెడివాడని, అట్లే జరిగెడిదని ప్రతీతి.

ఒకనాడాయన వీధి యరుగుపై కూర్చుండి మిత్రులతో ఇష్టాగోష్ఠి చేయుచుండగా ఒక వ్యక్తి సమీపమునకు వచ్చెను. శ్రీ శ్యామశాస్త్రి వానిని చూచి "వెంటనే ఇంటికి పోయి భగవన్నామస్మరణము చేసుకో. మృత్యువు నిన్ను వెంటాడుచున్నాడు. వారము దినములు మాత్రమే గడువు" అని చెప్పెను. ఆ వ్యక్తి దుఃఖముతో వెడలిపోయెను. ఎనిమిదవనాడతడు మరణించెను.

చివరి రోజులు వచ్చినట్లు దుఃఖించుచున్న మిత్రుడొకడు రాగా శ్రీ శ్యామశాస్త్రి "నీకు భయములేదు. నీకు మరి పదేండ్లు ఆయుర్దాయము" అని చెప్పెను. అట్లే జరిగినది.

ఒకనాడాయన మిత్రుడైన అన్నాకుట్టి అయ్యరు వెంటరాగా మానోజియప్ప వీధిలో పోవుచుండెను. ఆ వీధిలో మందుగుండుసామాను దుకాణమొకటి ఉండెను. ఆ దుకాణదారు గర్విష్ఠి. వాడు వీరిని చూచి తన దుకాణములో నున్న మరొకనితో "అదిగో, ఆ వెళ్ళుచున్న బొద్దు మనిషి కామాక్షి ఆలయంలో ప్రసాదాలు తిని బలిసిన పూజారి" అంటున్నాడు. ఆ మాటలు శ్రీ శ్యామశాస్త్రి విని, "పాపం వాడికి రోజులు దగ్గర కొచ్చినట్లున్నాయి" అన్నాడు.

మళ్లీ తిరిగి గంటలో వారా వీధిని తిరిగివచ్చునప్పటికి ఆ మందుగుండు సామానుల గుదాములో ఘోరమైన అగ్ని ప్రమాదం జరిగింది. సకలము నశించింది. ఆ పరిస్థితిని చూచి శ్రీ శ్యామశాస్త్రి జాలిపడినాడు.

శ్రీ శ్యామశాస్త్రికి లభించిన అదృష్టములలో ఉత్తమమైన ధర్మపత్ని లభించుట. ఆమె ఆయనను నిరంతరం సేవ చేసిన ఉత్తమ ఇల్లాలు. ఆమె పుణ్యసాధ్వి. ఆయనకంటె ముందే గతించినది. ఆమె దివంగతురాలైనదని పరామర్శించుటకు మిత్రులు రాగా శ్రీ శ్యామశాస్త్రి "అయిదు రోజుల వియోగానికి ఇక్కడ ఏడుపా?" అన్నాడు. ఆయన మాటలు వారికి అవగాహన కాలేదు.

భార్యపోయిన ఆరవ దినమున ఆయన సిద్ధిపొందెను. చివరిక్షణమువరకు ఆయనకు స్మృతి పోలేదు. మధ్యాహ్నం మూడు గంటల కాలమున తన కుమారుడు సుబ్బరాయశాస్త్రి అంకమున తలపెట్టి పరుండి కుమారుని కర్ణమంత్రము నుచ్చరింపుమని చెప్పెను. చివరిక్షణమున కుమారుడు కుడిచెవిలో కర్ణమంత్ర ముచ్చరించుచుండగా ఆయన సిద్ధి పొందెను. ఆ దినము వ్యయనామ సంవత్సరమున మకర మాసమున శుక్ల దశమి. ఆంగ్ల తారీఖు 6-వ ఫిబ్రవరి 1827.

శ్రీ శ్యామశాస్త్రి తాను సిద్ధిపొందుదునని స్పష్టముగా కొన్నిగంటలు ముందుగా చెప్పుటవలన ఆ విషయము ఊరందరికి తెలిసినది. రాజాస్థానమున చిత్రలేఖకుడు వచ్చి ఆయన చిత్రపటమును శిరోభాగమువరకు తయారుచేసి ఆయనకు చూపి అనుమతి సంపాదించెను. ఆతరువాత మిగిలిన భాగములు పూరించినాడు.

శ్రీ శ్యామశాస్త్రి అర్చనచేసిన శ్రీచక్రము, విగ్రహములు ఆయన వంశస్థుల గృహములం దున్నవి. శ్రీ శ్యామశాస్త్రికి కుమారులు ఇద్దరు. పెద్దవాడు పంజుశాస్త్రి. రెండవవాడు సుబ్బరాయశాస్త్రి.

శ్రీ శ్యామశాస్త్రి రెండవ కుమారుడైన సుబ్బరాయశాస్త్రి తన అన్నగారి కుమారుడు అన్నాస్వామిశాస్త్రిని దత్తత చేసికొనెను. అన్నాస్వామిశాస్త్రికి శ్యామశాస్త్రి కుమారుడు. అతని కుమారుడు సుబ్రహ్మణ్యశాస్త్రి అనబడు చిక్కశాస్త్రి. ఈయన వద్దనే శ్రీ శ్యామశాస్త్రి అర్చించిన శ్రీచక్ర విగ్రహాదు లున్నవి. ఈ వంశమువారు సంగీతమును నేటి వరకు సంరక్షించుకొనుచునే యున్నారు.

శ్రీ శ్యామశాస్త్రిగారికి శిష్యవర్గము చాల తక్కువ. ఆయన శిష్యులలో కుమారుడు సుబ్బరాయశాస్త్రి ప్రముఖుడు. సుబ్బరాయశాస్త్రి తన తండ్రిగారి వద్దనే మాత్రమే కాకుండా శ్రీ త్యాగరాజు, శ్రీ ముత్తుస్వామి దీక్షితులవద్ద కూడ సంగీత మర్మములు గ్రహించి వారిని మెప్పించినవాడు.

శ్రీ సుబ్బరాయశాస్త్రి పన్నెండు సంవత్సరములు మదరాసులో నివసించెను. ఆయన రచించిన కృతులు ప్రసిద్ధిని పొందినవి. ఆయన కాంచీపురమున కొన్ని సంవత్సరము లుండెను. అది ఆయన అత్తమామల స్థలము. కాంచీపురమున పురపాలకసంఘ కార్యాలయమున గల రికార్డులలో ఆయన పేర్లు కన్పించుచున్నవి. ఆయన

కూడ తండ్రివలెనే సిద్ధపురుషుడై అంత్యకాలమును ముందుగా చెప్పి సిద్ధిపొందెను.

శ్రీ శ్యామశాస్త్రి శిష్యులలో పొరంబూరు కృష్ణయ్య రొకడు. ఆయన మంచి గాయకుడు. అలసూరు కృష్ణయ్యరు శ్రీ శ్యామశాస్త్రి శిష్యులలో మరొకడు. ఇతడు మైసూరు ఆస్థాన సంగీత విద్వాంసుడుగా నుండి ప్రఖ్యాతి గడించినవాడు. ఇతని కుమారుడు సుబ్బరాయశాస్త్రికూడ ఖ్యాతిగడించిన సంగీతకారుడు.

శ్రీ శ్యామశాస్త్రికి దాసరి యను నాగస్వర విద్వాంసు డొకడు శిష్యుడుండెను. అతనిని గురించి జనశ్రుతిగాథ యొకటి కలదు. అతడు తిరువైయారులో దేవుని ఊరేగింపు ఉత్సవమున నాగస్వరము వాయించుచు ఒకనాడు ఊరేగింపు దక్షిణపుమాడ వీధికి వచ్చినపుడు శుద్ధసావేరిరాగ ఆలాపన మధురాతిమధురముగ చేసి "దరిని తెలిసి కొంటి" అను కృతిని పాడెనట. అతడు నాగస్వరముమీద పలికించిన సంగతులు పరమ రమణీయములై శ్రోతలకు అమృతవర్షము కురిపించినట్లున్నవట. అచ్చటకు సమీపముననున్న తమ గృహమునుండి వినుచున్న శ్రీ త్యాగరాజు ఆనందపులకితుడై వచ్చి దాసరిని ఆనందబాష్పములతో ప్రశంసించెనట. సంగీత మూర్తీభావమై, మహాత్ముడై, మహాభక్తుడై, తపశ్చక్రవర్తి యైన శ్రీ త్యాగరాజు తన్ను ప్రశంసించుట దాసరి ఆపుకొనలేక ఆవేశభరితుడై వణికిపోయెనట. ఆ సంగీత తపస్వి అతనికి భయములేదని చెప్పి ఆశీర్వదించెనట.

సంగీత తపస్సిద్ధుడైన శ్రీ శ్యామశాస్త్రి తనకృతులతో తెలుగుభాషను సంపన్నము చేసిన మహనీయుడు. తెలుగు భాషలోని సహజ మాధుర్యమునకు సాఫల్యత సమకూర్చిన సంగీత సరస్వతి. సంగీత జగత్తులో శ్రీ త్యాగరాజు ప్రక్క కూర్చుండ తగిన యోగ్యతామూర్తి.

మద్రాసు - 33
13 - 7 - 1975

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

# కీర్తనల అకారాది సూచిక

# మేళకర్త జన్యక్రమమున కీర్తనలు

| | | | |
|---|---|---|---|
| | పాహి శ్రీగిరిరాజసుతే | రూపకము | 27 |
| | మతి జేరగతి | చాపు | 29 |
| | హిమాచల తనయ | చాపు | 30 |
| | సామిని రమ్మనవే (వర్ణము) | ఖ. ఆట | 11 |
| ముఖారి | పాలింపవమ్మా | ఆది | 30 |
| మధ్యమావతి | పాలించు కామాక్షి | ఆది | 31 |
| ఆభేరి | నినువినా మతిగలదా | రూపకము | 32 |
| కాంభోజి | దేవి నీదు పదసారసములు | ఆది | 38 |
| యదుకుల కాంభోజి | కామాక్షి నీదు (స్వరజతి) | త్రిపుట | 6 |
| నాటకురంజి | మాయమ్మ నన్ను | ఆది | 33 |
| కేదారగౌళ | పరాకేల | ఆది | 34 |
| శంకరాభరణము | సరోజదళనేత్రి | ఆది | 35 |
| బేగడ | దయానిధే ( వర్ణము ) | ఆది | 13 |
| జనరంజని | నను బ్రోవరాదా | త్రిపుట | 36 |
| వరాళి | కరుణ జూడవమ్మ | ఆది | 36 |
| | కామాక్షి బంగారు | చాపు | 36 |
| పూరికల్యాణి | నిను వినాగామతి | చాపు | 37 |
| చింతామణి | దేవి బ్రోవ సమయము | ఆది | 38 |
| కల్యాణి | తల్లి నిన్ను నెర | మిశ్రచాపు | 38 |
| | బిరాన వరాలిచ్చి | రూపకము | 39 |
| | హిమాద్రిసుతే | రూపకము | 40 |
| | శంకరి శంకరి | ఆట | 40 |

